తెరచి, రెచ్చిపోయి, హేతువాదనలకు దిగేవరకు పశుబలాన్ని చేపట్టారు. అది ఇంకా సాగుతూనేవుంది. కాబట్టి అనవసర భ్రాంతులతో కొట్టుకపోకండి. మనిషి మనిషిగా జీవించేమార్గమేదో, అదిఒకటే మనకుగీటురాయి. ఆ ఆత్మవిశ్వాసం కలిగిఉండి స్పష్టమైన గమ్యం తెలిసికొని రంగంలో దూకంది లాభంలేదు. స్వాతంత్ర్యం, అధికారం ఏ ఒకరి సొత్తుగాక, ఎల్లరి అనుభూతికి, ఆచరణకు అందుబాటులోనుండే సమిష్టి హక్కుగా పరిణమించినప్పుడే, ఏదేశమైనా సుభిక్షంగా ఉంటుంది. బాధ్యతా రహిత ప్రభుత్వాల ఉనికి నశిస్తుంది. సరే, మన భావాలతోపాటు మన సంసిద్ధతను కూడా జగపతిరెడ్డిగారికి తెలుపుదాం" అని కంఠీరవం అంటుండగా వెంకటేశ్వర్రావు, పరంధామయ్య, బషీరు మాట్లాడుకుంటూ గ్రంథాలయంలోకి ప్రవేశించారు.

"ఏం బషీర్! మళ్ళా మనం వచ్చినచోటికి వెళ్ళాలె" కంఠీరవం ముసిముసిగా నవ్వుతూ అన్నాడు.

"మీ రాజవంశానికి రోజులు దగ్గరికివచ్చాయి" విజయదేవు హేళనగా అన్నాడు.

బషీరు దిగాలుపడి చూచాడు. పరంధామయ్య విజయదేవు చేతిలోని కాగితాలను ఆతురతతో తీసుకున్నాడు. వెంకటేశ్వర్రావు, పరంధామయ్య కలిసి చదువసాగారు.

"ఏం సంగతి మారాజ్?" బషీరు మందహాసంతో అడిగాడు.

"ఏమీలేదు. ఇప్పటి సర్కారును పూర్తిగా మార్చేసి, మొత్తం ప్రజల ఇష్టంపైన కొత్తసర్కారును ఏర్పాటుచేయాలని కొందరనుకుంటున్నారట. ఆ సంగతే జగపతిరెడ్డిగారు వ్రాశారు."

"అయితే మనమేం చేయాలె?"

"చాలా చేయాల్సుంటుంది. ఊడలుపారిన మర్రిచెట్టును చూచుంటావు. అంతగట్టిగా వేళ్ళు పాతుకొని ఉంటాయి ప్రభుత్వాలు. మరి మర్రి చెట్టును పీకేయడమంటే ఒకరిద్దరితో అయ్యేదికాదు" ఇంకా కంఠీరవం పూర్తిచేయకముందే, మధ్యలో విజయదేవు కల్పించుకొని "భూమిలో ఒక్క వేరున్నా దాని దుంపతెగ మళ్ళా చిగురుపెడ్తుంది ఆ మర్రిచెట్టు" అనినవ్వాడు.

కంఠీరవం తిరిగి చెప్పసాగాడు. "మరి ఈ ప్రభుత్వాలను మార్చ దానికి ప్రజలంతా ఒకటయ్యేవరకు కుక్కను తలుపుపెట్టి కొడితే పైనబడి కరుస్తాదంటారే. అట్లనే ఈ సర్కారోళ్ళంతా ఇష్టమొచ్చిన పనిచేస్తారు."

"మనం జేలుకు పోవాల్నా మళ్ళ?" బషీరు అమాయకంగా అడిగాడు.

"అవును.వందలఏండ్లనించి ఇష్టమొచ్చినట్లు ఆటలాడిన ప్రభుత్వం తనకింద అణగివున్న ప్రజలు ఎదురుతిరిగితె ఊరుకుంటుందా? రెచ్చిపోయి పిచ్చి పనులన్ని చేస్తుంటది. దాంట్లో జేళ్ళలో పెట్టడంకూడా ఒకటి. మరి మొదటిసారి నన్ను జేలుకు పంపిందెందుకో ఎరికేగా?" కంఠీరవం విపులీకరించాడు. "మంచి ప్రభుత్వం వచ్చేదాకా కష్టాలు తప్పవు." తిరిగి అన్నాడు.

"మంచి ప్రభుత్వమంటే?" బషీరు ఆదుర్దాగా అడిగాడు.

"మంచి ప్రభుత్వంలో నీ తల్లిదండ్రులవలె పొట్ట కెళ్ళక కన్న బిడ్డలను అమ్ముకోరు,వదులుకోరు. అన్యాయంగా ఇతరుల ఆస్తులను ఆక్ర

మించరు. ఒకనికి ఒకనికీ ద్వేషం ఉండదు. అన్నంలేదని అరచేవాండ్లుం దరు. చదువురాని వాడు ఉండదు. అందరు నీతితో ఉంటారు. కట్టుగా ఉంటారు. దయతో మెలుగుతారు. ముఖ్యంగా అంతా ఆప్తులుగా బతుకు తారు" అని కంఠీరవం ముగించి, "పరంధామయ్యగారు! మనమంతా ఒక సారి హైద్రాబాదుకు వెళ్ళిరావాలె" ఆలోచనా ధోరణిలో అన్నాడు.

"అయితే మారాజ్! ఇక్కడ మనమంతా కలిసున్నట్టే అంతా కలిసుంటరన్నమాట మంచి ప్రభుత్వంలో?" బషీరు ప్రశ్నించాడు.

కంఠీరవం మందహాసం కురిపిస్తూ "అవును" అన్నాడు.

ఒకనాడు కంఠీరవం అందరితోకలిసి, ఇంటికివెళ్ళి, తల్లి, వదినెల కాళ్ళపైబడి, "వెళ్ళొస్తమ్మా" గంభీరంగా అని తిరిగి వచ్చాడు.

కొమరయ్య తప్ప అందరూ హైదరాబాదు బయలుదేరారు. వీరు వెళ్ళిపోయిన కొద్దిదినాలకే హైద్రాబాదులో స్టేటు కాంగ్రెసు ప్రథమ సత్యాగ్రహం ప్రారంభమైంది.

ఇంతలో రామభూపాల్‌రావు శిక్ష ముగిసి డిమ్మెగూడెం చేర కున్నాడు. వచ్చి రావడంతోనే, అధికార వర్గానికి అండగా నిలిచి గ్రామ ప్రజలపై అధికారం చేయడం సాగించాడు. గ్రంథాలయం మూతపడ్డది వెంకటేశ్వర్రావు యింటిలో పోలీసు నాకా పెట్టించాడు.

వెంకటేశ్వర్రావు డిక్టేటరుగా, బషీర్, కంఠీరవం, పరంధామయ్య విజయదేవు అనుచరులుగా ఒక దళంగా సత్యాగ్రహంచేసి నిర్బంధిం బడ్డారు.



## శ్రీ వట్టికోట అళ్వారుస్వామి

క్రీ. శ. 1914 లో జననం.

1961 ఫిబ్రవరి న

మరణం.

స్వయంకృషితో ప్రతిభావంతుడైన వ్యక్తి. పిన్న వయస్సులో హోటల్ కార్మికుడుగా పని చేశారు. ఆ దశలోనే స్వయం కృషితో విద్యాభ్యాసం.

'క్విట్ ఇండియా' ఉద్యమంలో తీవ్రంగా పనిచేశారు. 1944 లో కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం. 1946 నిజాం వ్యతిరేక తెలంగాణా ఉద్యమంలో జైలు.

1941 నుంచి రచయితగానూ, దేశోద్ధారక గ్రంథమండలి వ్యవస్థాపకులుగానూ ప్రఖ్యాతి పొందారు. వీరి 'ప్రజల మనిషి', 'గంగు' తెలంగాణా సాహిత్యరంగంలో సుస్థిరస్థానాన్ని సంపాదించాయి.

వీరి కథల సంపుటి 'జైలులోపల' అనే పేరుతో ప్రచురించబడింది.

Wrapper Printed at Swatantra Art Printers, Vijayawada - 520 004.

